# అథ ఏక చత్వారింశో% ధ్యాయః

# కిరాతార్జునీయము

తమాగతం తతో దృష్ట్వా ధ్యానం కృత్వా శివస్యచ సః | గత్వా తత్రార్జునస్తేన యుద్ధం చక్రే సుదారుణమ్ || 1

గణైశ్చ వివిధైస్తీ క్ష్ణైరాయుధైస్తం న్యపీడయత్ | త్రైస్తదా పీడితః పార్థస్సస్మార స్వామినం శివమ్ || 2

అర్జునశ్చ తదా తేషాం బాణావలి మథాచ్ఛినత్ | యదా యుద్ధం చ త్రైః క్షిప్తం తతఃశర్వం పరామృశత్ || 3

పీడితాస్తే గణాస్తేన యయుశ్చైవ దిశో దశ | గణ   శా వారితాస్తే చ నా జగ్ముః స్స్వామినం ప్రతి || 4

శివశ్చైవార్జునశ్చైవ యయుధాతే పరస్పరమ్ | నానావిధైశ్చాయుధైర్వీ మహాబల పరాక్రమౌ || 5

శివో% పి మనసా నూనం దయాం కృత్వార్జునం హ్యగాత్ | అర్జునశ్చ దృఢం తత్ర ప్రహారం కృతవాంస్తదా || 6

ఆయుధాని శివస్సో వై హ్యర్యునస్యాచ్ఛినత్తదా | కవచాని చ సర్వాణి శరీరం కేవలం స్థితమ్ || 7

తదార్జునశ్శివం స్మృత్వా మల్లయుద్ధం చకార సః | వాహినీ పతినా తేన బయాత్ క్లిష్టో %పి ధైర్యవాన్ || 8

తద్యుద్ధేన మహీ సర్వా చకంపే ససముద్రకా | దేవా దుఃఖంసమాపన్నాః కిం భవిష్యతి వా పునః || 9

ఏతస్మిన్నంతరే దేవ శ్శివో గగనమాస్థితః | యుద్ధం చకార తత్రస్థ స్సో %ర్జునశ్చ తథా% కరోత్ || 10

తరువాత అర్జునుడు అచటకు భిల్లరాజు వచ్చుటను గాంచి శివుని ధ్యానించి ఆతని వద్దకు వెళ్లి ఆతనితో మిక్కిలి దారుణమగు యుద్ధమును చేసెను (1). వివిధ గణములు పదునైన ఆయుధములతో ఆతనిని పీడించిరి. ఆ విధముగా వారిచే పీడకు గురి చేయబడిన అర్జునుడు శివప్రభుని స్మరించెను (2). అపుడు అర్జునుడు మనస్సులో శివుని స్మరించి యుద్ధములో వారిచే విడువబడిన బాణములచే పీడింపబడిన వాడై ఆ బాణసమూహములను ఛేదించెను(3). ఆతనిచే పీడకు గురి చేయబడిన ఆ గణములు పది దిక్కులకు పరుగులెత్తిరి. గణాధ్యక్షులు శివునిచే వారింపబడిన వారై ఆ ప్రభువుకు తోడుగా వెళ్లలేదు (4). శివార్జునులు ద్వంద్వయుద్ధమును చేసిరి. మహాబలపరాక్రమములు గల వారిద్దరు అనేకవిధములగు ఆయుధములను ప్రయోగించుచుండిరి (5). శివుడు మనస్సులో దయ గలవాడై అర్జునుని సమీపించగా, అర్జునుడు అపుడు ఆయన పై పెద్ద ప్రహారమును కొట్టెను (6). మరియు శివుడపుడు అర్జునుని ఆయుధముల నన్నింటిని, మరియు కవచములను ఛేదించగా, అర్జునుడు కేవల శరీరముతో నిలబడెను (7). అపుడు అర్జునుడు శివుని స్మరించి భయపీడితుడై నమూధైర్యమును వహించి ఆ భిల్లరాజుతో మల్లయుద్ధమును చేసెను (8). ఆ యుద్ధముచే సముద్రములతో సహా భూమి అంతయూ కంపించెను. 'ఏమి కాబోవుచున్నదో' యని దేవతలు దుఃఖమును పొందిరి (9). ఇంతలో శివప్రభువు ఆకసమునకెగురగా, అర్జునుడు కూడ అటులనే చేసి ఆకాశములో నున్నవాడై యుద్ధమును చేసెను (10).

ఉడ్డీయోడ్డీయ తౌ యుద్ధం చక్రతుర్దేవపార్థివౌ | దేవాశ్చ విస్మయం ప్రాపూ రణం దృష్ట్వా తదాద్భుతమ్ || 11

అథార్జునోత్తరం జ్ఞాత్వా స్మృత్వా శివపదాంబుజమ్ | దధార పాదయోస్తం వై తద్ధ్యానాదాప్త సద్బలః || 12

ధృత్వా పాదౌ తదా తస్య భ్రామయామాస సో %ర్జునః | విజహాస మహాదేవో భక్తవత్సల ఊతికృత్ || 13

దాతుం స్వదాసతాం తస్మై# ్మ భక్త వశ్యతయా మునే | శివేనైవ కృతం హ్యేతచ్చరితం నాన్యథా భ##వేత్ || 14

పశ్చాద్వివాహస్య తత్రైవ శంకరో రూపమద్భుతమ్ | దర్శయామాస సహసా భక్త వశ్యతయా శుభమ్ || 15

యథోక్తం వేదశాస్త్రేషు పురాణ పురుషోత్తమ | వ్యాసోపదిష్టం జ్ఞానాయ తస్య యత్సర్వసిద్ధిదమ్ || 16

తద్దృష్ట్వా సుందరం రూపం ధ్యానప్రాప్తం శివస్య తు | బభూవ విస్మితో %తీవ హ్యర్జునో లజ్జితస్స్వయమ్ || 17

అహో శివశ్శివస్సో% యం యో మే ప్రభుతయా వృతః | త్రిలోకేశస్స్వయం సాక్షాద్ధా కృతం కిం మయా% ధునా || 18

ప్రభోర్బల వతీ మాయా మాయినామపి మోహినీ | కిం కృతం రూపమాచ్ఛాద్య ప్రభుణా ఛలితో హ్యహమ్ || 19

ధియేతి సంవిచార్యైవం సాంజలిర్నతమస్తకః | ప్రణనామ ప్రభుం ప్రీత్యా తదోవాచ స ఖిన్నధీః || 20

శివార్జునులిద్దరు ఆకాశములో ఇటునటు ఎగురుచూ యుద్ధమును చేయు చుండిరి. అపుడా అద్భుతమగు యుద్ధమును గాంచి దేవతలు ఆశ్చర్యమును పొందిరి (11). అపుడు అర్జునుడు తన తరువాతి కర్తవ్యమునెరింగి శివుని పాదపద్మములను ధ్యానించి అవకాశమునెరింగి శివుని ధ్యానించుటచే కలిగిన మహాబలము గలవాడై అయనను పాదముల యందుపట్టుకొనెను (12). ఆ అర్జునుడు అపుడాయన పాదములను పట్టకొని గిరగిర త్రిప్పెను. భక్తవత్సలుడు, లీలలను ప్రకటించువాడు అగు మహాదేవడు నవ్వుచుండెను (13). ఓ మునీ! భక్తపరాధీనుడగు శివుడు ఆతనికి తన దాస్యము నీయదలచి స్వయముగా ఈ చరితమును ప్రవర్తిల్ల జేసెను. ఈ చరితమునకు మరిమొక కారణము లేదు (14). తరువాత భక్తపరాధీనుడగు శంకరుడు నవ్వి మంగళకరమ అద్భుతము అగు రూపమును వెంటనే చూపించెను (15). ఓ పురుష శ్రేష్ఠా! వేదశాస్త్రములయందు పురాణములలో

వర్ణింపబడినది, ఉపాసన కొరకై వ్యాసునిచే ఉపదేశింపబడినది, అర్జునునకు సర్వ సిద్ధులను ఇచ్చినది, ధ్యానములో ఆతనిచే దర్శింపబడునది ఆగు శివుని ఆ సుందరరూపమును గాంచి అర్జునుడు అత్యంతము ఆశ్చర్యమును పొందిన వాడై స్వయముగా చాల సిగ్గు పడెను.(16, 17). ఆశ్చర్యము! శివుడు! ఈయన శివుడు. నేను ఈయనను నా ప్రభువుగా స్వీకరించి యుంటిని. ముల్లోకములకు ప్రభువగు ఈయన స్వయుముగా ప్రత్యక్షమైనాడు. అయ్యో! ఇప్పుడు నేను చేసిన పని యేమి? (18) శివప్రభుని మాయ బలవత్తరమైనది. అది మాయావులను కూడ మోహింపజేయును. ప్రభుడు తన యథార్థరూపమును కప్పిపుచ్చి నన్ను మోసగించి ఎంతపని చేసినాడు? (19) అర్జునుడు తన మనస్సులో ఇట్టు తలపోసి చేతులు జోడించి తలవంచి ఆ ప్రభునకు ప్రేమతో నమస్కరించెను. అపుడాతడు ఖేదముతో నిండిన హృదయము గలవాడై ఇట్లు పలికెను. (20).

అర్జున ఉవాచ |

దేవ దేవ మహాదేవ కరుణాకర శంకర | మమాపరాధం సర్వేశ క్షంతవ్యశ్చ త్వయా పునః || 21

కిం కృతం రూపమాచ్ఛాద్య ఛలితో%స్మి త్వయాధునా | ధిజ్మాం సమరకర్తారం స్వామినా భవతా ప్రభో || 22

అర్జునుడిట్లు పలికెను-

ఓ దేవదేవా! మహాదేవా! కరుణానిధీ! శంకరా! ఓ సర్వేశ్వరా! నీవు నా అపరాధమును మన్నించవలెను (21). ఓ ప్రభూ! నీవు నీ రూపమును కప్పిపుచ్చి ఎంత పని చేసితివి? నేనీనాడు నీచే మోసగించబడితిని. స్వామివి అగు నీతో యుద్ధమును చేసిన నాకు నిందయగు గాక ! (22)

నందీశ్ర ఉవాచ |

ఇత్యేవం పాండవస్సో %థ పశ్చాత్తాపమవాప సః |
పాదయోర్నిపపాతాశు శంకరస్య మహాప్రభోః || 23

అథేశ్వరః ప్రసన్నాత్మా ప్రత్యువాచార్జునం చ తమ్ | సమాశ్వాస్యేతి బహుశో మహేశో భక్తవత్సలః || 24

నందీశ్వరుడిట్లు పలికెను-

అపుడు ఆ అర్జునుడు ఈ తీరున పశ్చాత్తాపమును పొందినవాడై వెంటనే శంకరమహాప్రభుని పాదములపై పడెను (23). అపుడు భక్తవత్సలుడు, మహేశ్వరుడు అగు శంకరుడు ప్రసన్నమగు మనస్సు గలవాడై అర్జునుని పరిపరి విధముల ఓదార్చి ఆతనితో నిట్లనెను (24).

శంకర ఉవాచ |

న ఖిద్య పార్థ భక్తో%సి మమ త్వం హి విశేషతః | పరీక్షార్థం మయా తే %ద్య కృతమేవం శుచం జహి || 25

శంకరుడిట్లు పలికెను-

ఓ అర్జునా! దుఃఖించకుము. నీవు నాకు మహాభక్తుడవు. నేను నిన్ను పరీక్షించుటకొరకు మాత్రమే ఈ నాడిట్లు చేసితిని. దుఃఖమును విడనాడుము (25).

నందీశ్వర ఉవాచ |

ఇత్యుక్త్వా తం స్వహస్తాభ్యాముత్థాప్య ప్రభురర్జునమ్ | విలజ్జం కారయామాస గణైశ్చ స్వామినో గణైః || 26

పునశ్శివోర్జునం ప్రాహ పాండవం వీరసమ్మతమ్ | హర్షయన్ సర్వథా ప్రీత్యా శంకరో భక్త వత్సలః || 27

నందీశ్రుడిట్లు పలికెను-

శివుడు ఇట్లు పలికి తన చేతులతో అర్జునుని పైకి ఎత్తి తాను స్వయముగ చెప్పుటయే గాక గణములచే చెప్పించి అర్జునుడు లజ్జను విడనాడునట్లు చేసెను (26). మంగళకరుడు,

భక్తవత్సలుడు నగు శివుడు వీర పూజ్యుడు, పాండుపుత్రుడనగు అర్జునుని ప్రేమతో అన్ని విధములుగా హర్షయుక్తుని చేసి మరల ఇట్లు పలికెను (27).

శివ ఉవాచ |

హే పార్థ పాండవశ్రేష్ఠ ప్రసన్నో%స్మి వరం వృణు |
ప్రహారైస్తాడనైస్తే %ద్యపూజనం మానితం మయా || 28

ఇచ్ఛయా చ కృతం మే %ద్య నాపరాధస్తవాధునా | నాదేయం విద్యతే తుభ్యం యదిచ్ఛసి వృణీష్వ తత్ || 29

తే శత్రుషు యశో రాజ్యస్థాపనాయ శుభం కృతమ్ | ఏతద్దుఃఖం న కర్తవ్యం వైక్లబ్యం చ త్యజాఖిలమ్ || 30

శివుడిట్లు పలికెను-

ఓ పార్థా! నీవు పాండవులలో శ్రేష్ఠుడవు. ప్రసన్నుడనైతిని. వరమును కోరుకొనుము. ఈనాడు నేను దెబ్బలను తాడనములను పూజారూపములో స్వీకరించుచున్నాను. (28). ఈ నాటి చరిత్ర అంతయు నా ఇచ్ఛచే జరిగినది. దీనిలో నీ అపరాధము లేదు. నీకు ఈయరానిది లేదు. నీకు ఏది నచ్చునో, దానిని కోరుకొనుము (29). నీవు శత్రువులను జయించి కీర్తిని రాజ్యమును స్థాపించుట కొరకై శుభకరమగు తపస్సును చేసితివి. నీవు ఈ తీరున దుఃఖించకుము. నీలోని నిరత్సాహమును పూర్తిగా విడిచిపెట్టుము (30).

నందీశ్వర ఉవాచ !

ఇత్యుక్తస్త్వర్జునస్తేన ప్రభుణా శంకరేణ సః | ఉవాచ శంకరం భక్త్యా సావధానతయా స్థితః || 31

నందీశ్వరుడిట్లు పలికెను-

ఆ శంకరప్రభుడిట్లు పలుకగా ఆ అర్జునుడు సావధానమనస్కుడై శంకరుని ఉద్దేశించి భక్తితో నిట్లు పలికెను (31).

అర్జున ఉవాచ |

భక్త ప్రియస్య శంభోస్తే సు ప్రభో కిం సమీహితమ్ | వర్ణనీయం మయా దేవ కృపాలుస్త్వం సదాశివ || 32

ఇత్యుక్త్వా సంస్తుతిం తస్య శంకరస్య మహాప్రభోః | చకార పాండవస్సో %థ సద్భక్తిం వేదసంమతామ్ || 33

నమస్తే దేవ దేవాయ నమః కైలాసవాసినే | సదాశివ సమస్తుభ్యం పంచవక్త్రాయ తే నమః || 34

కపర్దినే నమస్తుభ్యం త్రినేత్రాయ నమోస్తు తే | నమః ప్రసన్నరూపాయ సహస్రవదనాయ చ || 35

నీలకంఠ నమస్తేస్తు సద్యోజాతాయ వై నమః | వృషధ్వజ నమస్తేస్తు వామాంగ గిరిజాయ చ || 36

దశదోష నమస్తుభ్యం నమస్తే పరమాత్మనే | డమరు కపాలహస్తాయ నమస్తే ముండమాలినే || 37

శుద్ధస్ఫటిక సంకాశ శుద్ధకర్పూర వర్ష్మణ | పినాకపాణయే తుభ్యం త్రి శూలవరధారిణ || 38

వ్యాఘ్రచర్మోత్తరీయాయ గజాంబరవిధారిణ | నాగాంగాయ నమస్తుభ్యం గంగాధర నమో %స్తు తే || 39

సుపాదాయ నమస్తే %స్తు ఆరక్త చరణాయ చ | నంద్యాది గణసేవ్యాయ గణ శాయ చ తే నమః || 40

నమో గణ శరూపాయ కార్తికేయానుగాయ చ | భక్తిదాయ చ భక్తానాం ముక్తాదాయ నమో నమః || 41

అగుణాయ నమస్తే%స్తు సగుణాయ నమో నమః | అరూపాయ సరూపాయ సకలాయాకలాయ చ || 42

నమః కిరాతరూపాయ మదనుగ్రహకారిణ | యుద్ధప్రియాయ వీరాణాం నానాలీలానుకారిణ || 43

అర్జునుడిట్లు పలికెను-

ఓ మహాప్రభూ! భక్తప్రియుడవగు నీకు కోరదగినది ఏమి గలదని నేను చెప్పవలెను? ఓ దేవా! సదాశివా ! నీవు దయామూర్తివి (32). అర్జునుడు అపుడు ఇట్లు పలికి గొప్ప భక్తితో శంకరమహాప్రభుని ఉద్దేశించి వేద ధర్మమునకు అను రూపమగు చక్కని స్తుతిని చేసెను (33). దేవదేవుడు, కైలాసవాసి, సదాశివుడు, అయిదు మోములవాడు (34), జటా జూటధారి, ముక్కంటి, ప్రసన్నమగు రూపము గలవాడు, అనంతముఖములు గలవాడు (35), నీలకంఠుడు, సద్యోజాతుడు, వృషభధ్వజుడు, ఎడమ భాగమునందు పార్వతిని ధరించిన వాడు (36), పది భుజములు గలవాడు, పరమాత్మ, డమరువును కపాలమును చేతియందు ధరించినవాడు, కపాలమాలను దాల్చినవాడు (37), స్వచ్ఛమగు స్ఫటికము వలె కర్పూరము వలె తెల్లని దేహము గలవాడు, పినాకమును చేతబట్టినవాడు, గొప్ప త్రిశూలమును ధరించువాడు (38), వ్యాఘ్రచర్మమే ఉత్తరీయముగా గలవాడు, గజచర్మమును దాల్చినవాడు, పాములను శరీరావయవములయందు దాల్చినవాడు, గంగాధరుడు (39), ఎర్రని అందమైన పాదములు గలవాడు, నంది మొదలగు గణములచే సేవింపబడువాడు, గణాధ్యక్షుడు అగు నీకు అనేకానేక నమస్కారములు (40). కార్తికేయునిచే అనుసరింపబడే గణపతి నీ స్వరూపమే. భక్తులకు భక్తిని ముక్తిని కూడ ఇచ్చువాడు (41), నిర్గుణుడు, సగుణుడు, నీరూపుడు, సరూపుడు, నిరంశుడు, అంశములు గలవాడు (42), కిరాతరూపమును దాల్చి నన్ను అనుగ్రహించినవాడు, వీరులతో యుద్ధమును చేయుటలో ప్రీతి గలవాడు, అనేక లీలలను ప్రకటించువాడు నగు నీకు పునః పునః నమస్కారమ (43).

యత్కించి ద్దృశ్యతే రూపం తత్తేజస్తావకం స్మృతమ్ | చిద్రూపస్త్వం త్రిలోకేషు రమసే% న్వయభేదతః || 44

గుణానాం తే న సంఖ్యాస్తి యథా భూరజసామిహ | ఆకాశే తారకాణాం హి కణానాం వృష్ట్యపామపి || 45

న తే గుణాంస్తు సంఖ్యాతుం వేదా వై సంభవంతి హి |
మందబుద్ధిరహం నాథ వర్ణయామి చ కం పునః || 46

సో %సి యో%సి నమస్తే%స్తు కృపాం కర్తు మిహార్హసి | దాసో %హం తే మహేశాన స్వామీ త్వం మే మహేశ్వర || 47

ఈ ప్రపంచములో ఏ రూపము కానవచ్చిననూ, అది నీ తేజస్సు మాత్రమేనని చెప్పబడినది. చిద్ఘనుడవగు నీవు ఉపాధిభేదముచే ముల్లోకములయందు రమించుచున్నావు (44). భూమి యొక్క రేణువులు, ఆకాశమునందలి నక్షత్రములు మరియు వర్షమునందలి జలకణములు వలె నీ గుణములు అసంఖ్యాకములు (45). నీ గుణములను లెక్కించుటకు వేదములు కూడు సమర్థములగుట లేదు. ఓ నాథా! అట్టి స్థితిలో మందబుద్ధినగు నేను ఏ గుణమును వర్ణించదగును? (46) నీవు ఏదియో అదియే అగుదువు. నీకు నమస్కారము. నన్ను దయ చూడుము. నేను నీ దాసుడను. ఓ మహేశ్వరా! నీవు నా ప్రభుడవు (47).

నందీశ్వర ఉవాచ |

ఇతి శ్రుత్వా వచస్తస్య పునః ప్రోవాచ శంకరః | సుప్రసన్నతరో భూత్వా విహసన్ ప్రభురర్జునమ్ || 48

నందీశ్వరుడిట్లు పలికెను-

అర్జునుని ఈ మాటను విని శంకరప్రభుడు మిక్కిలి ప్రసన్నుడై నవ్వి మరల ఆతనితో నిట్లనెను (48).

శంకర ఆవాచ |

వచసా కిం బహూక్తేన శృణుష్వ వచనం మమ | శీఘ్రం వృణు వరం పుత్ర సర్వం తచ్చ దదామి తే || 49

శంకరుడిట్లు పలికెను-

అధికమగు పలుకులతో పనియేమి? నామాటను వినుము. ఓ పుత్రా! శీఘ్రముగా వరమును కోరుకొనుము. నీవు కోరిన సర్వమును నీకు ఇచ్చెదను (49).

నందీశ్వర ఉవాచ |

ఇత్యుక్తశ్చార్జునస్తేన ప్రణిపత్య సదాశివమ్ | సాంజలిర్నతకః ప్రేమ్ణా ప్రోవాచ గద్గదాక్షరమ్ || 50

నందీశ్వరుడిట్లు పలికెను-

సదాశివుడిట్లు పలుకగా అర్జునుడు చేతులు జోడించి తలను వంచి ఆయనకు ప్రణమిల్లి ప్రేమతో బొంగురుపోయిన కంఠముతో నిట్లు పలికెను (50).

అర్జున ఉవాచ |

కిం బ్రూయాం త్వం చ సర్వేషామంతర్యామితయా స్థితః | తథాపి వర్ణితం మే %ద్యశ్రూయతాం చ త్వయా విభో || 51

శత్రూణాం సంకటం యచ్చ తద్గతం దర్శనాత్తవ | ఐహికీం చ పరాం సిద్ధిం ప్రాప్నుయాం వై తథా కురు || 52

అర్జునుడిట్లు పలికెను-

నేనేమి చెప్పవలెను? నీవు సర్వప్రాణులలో అంతర్యామివై ఉన్నావు. అయిననూ, ఓ విభూ! నేను వర్ణించు విషయమును నీవు ఇపుడు వినుము (51). నీ దర్శనము వలన శత్రువుల సంకటము తొలగిపోయినది. నాకు ఇహలోకములో సర్వశ్రేష్ఠమగు సిద్ధి కలుగునట్లు చేయుము (52).

నందీశ్వర ఉవాచ |

ఇత్యుక్త్వా తం నమస్కృత్య శంకరం భక్తవత్సలమ్ | నతస్కంధో%ర్జునస్తత్ర బద్ధాంజలిరుపస్థితః || 53

శివోఽపి చ తథా భూతం జ్ఞాత్వా పాండవమర్జునమ్ | నిజభక్తవరం స్వామీ మహాతుష్టో బభూవ హ || 54

అస్త్రం పాశుపతం స్వీయం దుర్జయం సర్వదాఖిలైః | దదౌ తస్మై#్మ మహేశానో చేదమబ్రవీత్ || 55

నందీశ్వరుడిట్లు పలికెను-

అర్జునుడు భక్తవత్సలుడగు శంకరునరకు తలవంచి నమస్కరించి ఇట్లు పలికి చేతులు కట్టుకొని అచట నిలబడెనను (53). పాండుపుత్రుడు, తన భక్తులలో శ్రేష్ఠుడు అగు అర్జునుడు అట్లు నినలబడుటను గాంచి శివస్వామి మహానందమును పొందెను (54). మహేశ్వరుడు ఏ కాలమనందైననూ ఎవరి చేతనైననూ జయింప శక్యము కాని తన పాశు పతాస్త్రమును ఆతనికి ఇచ్చి ఇట్లు పలికెను (55).

శివా ఉవాచ |

స్వం మహాస్త్రం మయా దత్తం దుర్జయస్త్వం భవిష్యసి | అనేన సర్వశత్రూణాం జయకృత్యమవాప్నుహి || 56

కృష్ణం చ కథయిష్యామి సాహాయ్యం తే కరిష్యతి | స వై మమాత్మ భూతశ్చ మద్భక్తః కార్యకారకః || 57

మత్ర్పభావాద్భారత త్వం రాజ్యం నిష్కంటకం కురు | ధర్మాన్నానావిధాన్ భ్రాత్రా కారయ త్వం చ సర్వదా || 58

శివుడిట్లు పలికెను-

నేను నీకు నా మహాస్త్రము నిచ్చుచున్నాను. నీవు దుర్జయుడవు కాగలవు. దీని ప్రబావముచే శత్రువలనందరినీ జయించుము (56). నేను కృష్ణునితో చెప్పెదను. ఆయన నీకు సాహాయ్యమును చేయగలడు. ఆయన నాకు ఆత్మ, నా భక్తుడు మరియు కార్యకుశలుడు (57). ఓ అర్జునా! నా ప్రబావముచే నీవు రాజ్యములోని శత్రువులనందరినీ ఏరి వేయుము. నీవు సర్వదా మీ అన్నగారిచే అనేక విధముల ధర్మముననుష్ఠింపజేయుము. (58).

నందీశ్వర ఉవాచ |

ఇత్యుక్త్వా నిజహస్తం చ ధృత్వా శిరసి తస్య సః | పూజితో
హ్యర్జునేనాశు శంకరోంతరధీయత || 59

అథార్జునః ప్రసన్నాత్మా ప్రాప్యాస్త్రం చ వరం ప్రభోః | జగామ
స్వాశ్రమే ముఖ్యం స్మరన్ భక్త్యా గురుం శివమ్ || 60

సర్వే తే భ్రాతరః ప్రీతాస్తన్వః ప్రాణమివాదగతమ్ | మిలిత్వా తం
సుఖం ప్రాపుర్ద్రౌపదీ చాతి సువ్రతా || 61

శివం పరం చ సంతుష్టం పాండవవాస్సర్వ ఏవ హి | నాతృప్యన్
సర్వవృత్తాంతం శ్రుత్వా హర్షముపాగతాః || 62

ఆశ్రమే పుష్పవృష్టిశ్చ చందనేన సమన్వితా | పపాత సుకరార్థం చ
తేషాం చైవ మహాత్మనామ్ || 63

ధన్యం చ శంకరం చైవ నమస్కృత్య శివం ముదా | అవధిం
చాగతం జ్ఞాత్వా జయశ్చైవ భవిష్యతి || 64

ఏతస్మిన్నంతరే కృష్ణశ్ర్ఋుత్వార్జునమథా గతమ్ | మేలనాయ
సమాయతా శ్ర్ఋుత్వా సుఖముపాగతః || 65

అతశ్చైవ మయాఖ్యాత శ్శంకరస్సర్వదుఃఖహా | స సేవ్యతే మయా
నిత్యం భవద్భిరపి సేవ్యతామ్ || 66

ఇత్యుక్తస్తే కిరాతాహ్వో%వతార శ్శంకరస్య వై | తం శ్రుత్వా
శ్రావయన్ వాపి సర్వాన్ కామానవాప్నుయాత్ || 67

ఇతి శ్రీ శివమహాపురాణ శతరుద్రసంహితాయాం కిరాతావతార
వర్ణనం నామ ఏక చత్వారింశో %ధ్యాయః (41).

నందీశ్వరుడిట్లు పలికెను-

ఆ శంకురుడిట్లు పలికి తన చేతిని అర్జునుని శిరస్సుపై నుంచి
అర్జునునిచే పూజింపబడిన వాడై వెంటనే అంతర్ధానుడాయెను
(59). అపుడు అర్జునుడు ప్రసన్నమగు మనస్సు గలవాడై

శివప్రభుని నుండి అస్త్రమును వరమును పొంది, ప్రముఖగురువు అగు శివుని భక్తితో స్మరిస్తూ తన అశ్రమమునకు వెళ్లెను (60). ఆ నల్గురు సోదరులు మరియు మహాపతివ్రతయగు ద్రౌపది ఆతనితో కలిసి తమ శరీరముల లోనికి ప్రాణము మరలి వచ్చినదా యన్నట్లు సుఖమును పొందిరి (61). శివుడు మిక్కిలి సంతుష్టుడగుట ఇత్యాది వృత్తాంతమునంతనూ విని ఆ సోదరులందరు గొప్ప ఆనందమును పొందిరి. ఎంత విన్ననూ వారికి తనివి తీరలేదు (62). మహాత్ములగు ఆ సోదరుల సౌభాగ్యము కొరకై ఆశ్రమములో చందనముతో గూడిన పుష్పములు వర్షించెను (63). సంపదలనిచ్చి మంగళములను చేయు శివుని వారు ఆనందముతో నమస్కరించి అజ్ఞాతవాసమునకు అంతము సమీపించినదని యెరింగి విజయము లభించగలదని ఆశించిరి (64). ఇంతలో, అర్జునుడు సుఖముగా తిరిగి వచ్చినాడని విని ఆతనిని కలియుటకై శ్రీ కృష్ణుడు విచ్చేసెను (65). ఇందువలననే, శంకరుడు సర్వదుఃఖములను పోగొట్టుననియు, నేను నిత్యము ఆయనను సేవించుచున్నాను గనుక, మీరు కూడ ఆయనను సేవించుడనియు నేను చెప్పియుంటినని శ్రీ కృష్ణుడు చెప్పెను (66). నేనింతవరకు శివుని కిరాతావతారమును వర్ణించితిని. దీనిని విన్నవారు, వినిపించిన వారు తమ కోర్కెల నన్నటినీ పొందెదరు (67).

శ్రీ శివమహాపురాణములోని శతరుద్ర సంహితయందు కిరాతావతారవర్ణనమనే నలుబది ఒకటవ అధ్యాయము ముగిసినది (41).